# వర్ధిల్లాలి సబ్బు - నీళ్ళు



దుప్పటి
పారిపోయింది,
దిండు
లేచిపోయింది,
మంచంమీద నిలవకుండా పరుపు
మర్రిమరీ యెగిరి పడుతూవుంది.

దీపం వెలిగిద్దామంటే అది
దిగ్గున ఉడాయించింది.
పోనీలే, బొమ్మల పుస్తకం వుందిగా
పొద్దు గడుస్తుంది కాసేపు సరదాగా
అనుకుంటూ వుండగానే అదీ
హఠాత్తుగా మంచంకింద దూరింది.

కాస్త టీ తాగుదామంటే
కప్పులూ, సాసర్లూ పరుగెత్తిపోయినాయ్,
కేకులూ, బిస్కట్లూ, పాలూ, పంచదారా
కాళ్లు వచ్చినట్లు కదలిపోయినాయ్!








యేమిటి విషయం?
యేమి జరిగింది?
యేమిటి కారణం
యీ వైపరీత్యానికి?
యీ గంద్రగోళానికి?
యీ అల్లకల్లోలానికి?
ప్రపంచం తలకిందులైందా?

యిస్త్రీ పెట్టె
వెళ్లి తరిమింది
బూట్లను,
బూట్లు
వెంటబడినాయి
ప్లేట్లను,









యేమిటి విషయం?
యేమి జరిగింది?
యేమిటి కారణం
యీ వైపరీత్యానికి?
యీ గంద్రగోళానికి?
యీ అల్లకల్లోలానికి?
ప్రపంచం తలకిందులైందా?

యిస్త్రీ పెట్టె
వెళ్లి తరిమింది
బూట్లను,
బూట్లు
వెంటబడినాయి
ప్లేట్లను,





హఠాత్తుగా వచ్చింది అమ్మ గదిలోనుండి
ముసలి నీళ్ల తొట్టి మిలమిల లాడుతూ,
సొట్ట కాళ్లతో కుంటుతూ, గెంతుతూ,
సూటిగా వచ్చి నన్ను జూసి కేకలేసింది:

"ఓరి మురికి ముఖం దద్దమ్మా!
ఓరి దరిద్రపు పెద్దమ్మా!
బొగ్గు గని కార్మికుడు మేలు నీకంటె!
రొచ్చు గుంటలోని ఊరపంది నయం నీకంటె!
వెళ్లి అద్దంలో చూసుకో,
ముక్కుమీది మరక లేమిటో పోల్చుకో,
ఆ మెడ చూడు, చెవులు చూడు, చేతి వేళ్లు చూడు,
యెప్పుడూ కడుక్కున్న పాపాన పోలేదు గదా!
అందుకే నీ మేజోళ్లు కూడా పారిపోయినాయి!
నీ ముఖం చూసి ఓకరించుకున్నాయి!

"ప్రతి ఉదయం, ఓరి నలుసా,
యెలకలు ముఖం కడుక్కుంటాయి, తెలుసా?
పిల్లులూ, బాతులూ కూడా,
చీమలూ, సాలెపురుగులూ కూడా.

"ప్రొద్దున్నే నీవు తప్ప అందరూ
పళ్లు తోముకున్నారు, తల దువ్వుకున్నారు,
నీవొక్కనివే అలా కంపుకొడుతున్నావ్,
బట్టలు లేకుండా అలా మిగిలివున్నావ్.





"ప్రసిద్ధమైన నీళ్ల తొట్టిని నేను,
"పరిశుభ్రం" అంటారు నన్ను.
నీళ్ల తొట్లన్నీ నా ప్రజలు,
సబ్బులూ, బ్రష్షులూ నా సైనికులు.

"నేను కాలు తట్టితే చాలు
బిలబిలా వస్తారు నా సైనికులు,
గలగలలతో గది నిండుతారు,
క్షణంలో నిన్ను చుట్టుముట్టుతారు
గర్జిస్తారు, గాండ్రిస్తారు,
కాళ్లు నేల తాడించి ఘీంకరిస్తారు,
భయపడాకు, నీ తోలు ఒలువరు,
తళతళా మెరిసేటట్లు తోముతారు,
తరువాత నిన్ను పట్టుకొని
కాలువలో ముంచుతారు,
ముంచి లేవనెత్తుతారు."



అప్పుడది తన రేకు రొమ్ముమీద చరచి
అరచింది "ఓం హ్రీం" అంటూ.

వెంటనే వచ్చినాయి బ్రష్షులు ఒక మంద,
పొంతగడ్డల్లా వచ్చి పడినాయి నామీద,
రుద్దినాయి, తోమినాయి నన్ను, తోముతూ రుద్దినాయి,
రుద్దుతూ తోముతూ, యిలా పాట పాడినాయి:

"యీ మురికి వెధవను తోమాలి
మరింత తెల్లగా, తెల్లగా,
యీ రోత భడవను రుద్దాలి
మరింత శుభ్రంగా, శుభ్రంగా!"

పరుగు పరుగున సబ్బు వచ్చింది,
యెగిరి నా నెత్తిమీద కూర్చుంది,
తలంతా నురుగుతో నింపేసింది,
నాకు మతి పోయినంత పనైంది.






అప్పుడు తల రుద్దే పీచును చూసి,
నిజంగా భయం వేసి,
పారిపోడానికి ప్రయత్నించాను,
కానీ అది వెంటబడింది నన్ను.



వీధిలోకి పరుగెత్తాను,
గోడలూ, కంచెలూ దూకాను,
అది వేటకుక్కలా వెంటబడింది,
అడుగడుగునా నన్ను వెంబడించింది.

హఠాత్తుగా వీధి మలుపులో అప్పుడు
మొసలి మామయ్య నాకు కనిపించాడు,
అమడ పిల్లలతో షికారునుండి
అప్పుడే తిరిగివస్తూ వుండినవాడు.
నన్ను వెంటబడే పీచును చూశాడు
నోరు తెరచి మింగేశాడు.

తరువాత నావైపు కోపంగా చూశాడు,
నిప్పులు కక్కుతూ కేకలు వేశాడు:
''యెంత సిగ్గు లేదురా నీకు'' అని అరిచాడు,
''వెంటనే వెళ్లి ముఖం కడుక్కోపో'' అని కసిరాడు,
''లేదా నిన్ను చీల్చేస్తాను'' అని ఉరిమాడు,
''లేదా నిన్ను చంపేస్తాను'' అని తరిమాడు.



మెరుపు తీగలా యింటికి పరుగుతీశాను,
వెళ్లి "పరిశుభ్రం" యెదుట మళ్లీ నిలిచాను.
సబ్బూ, నీళ్లూ పోసి,
నీళ్లూ, సబ్బూ వేసి,

చేతులు సరిపేటట్లు తోమాను
మకిలంతా వదలిందాకా,
మరకలన్నీ పోయిందాకా,
నా ముఖం తళతళ మెరిసిందాకా.












నా బట్టలూ బూట్లూ అన్నీ
వచ్చినాయి నావద్దకు మళ్లీ,

రొట్టెముక్క నేరుగా నోటివద్దకు వచ్చింది,
"తినవోయి మిత్రమా నన్ను" అంటూ పలకరించింది.

వేడివేడి పెసరట్టు వేగంగా వచ్చి
వినయంగా నా నోట్లో దూరింది,




నా పుస్తకాలు తిరిగివచ్చినాయి అన్నీ,
నోటుబుక్కులూ బొమ్మల పుస్తకాలూ అన్నీ,
బొమ్మలు కూడా వచ్చినాయి వేగంగా,
చిందులు తొక్కుతూ కోలాహలంగా.



అప్పుడు "పరిశుభ్రం" అని పేరు గలట్టి
మహా ప్రసిద్ధమైన నీళ్ల తొట్టి
నీళ్ల తొట్లన్నీ తన ప్రజ లైనట్టిది
సబ్బులూ, బ్రష్షులూ తన సైనికు లైనట్టిది
ఆడుతూ, యెగురుతూ నావద్దకు వచ్చింది,
నన్ను ముద్దుబెట్టుకొని యిలా చెప్పింది:
"యెంత మంచివానివిరా బాబూ నీవు!
నీ బుద్ధు లన్నీ చక్కబడినాయి,
నీ పాడు అలవాట్లు అంతరించినాయి,
నీవిప్పుడు బంగారు కొండవు, వరాల మూటవు!"

పరిశుభ్రం అవసరం
ఉదయం, సాయంత్రం.
యెప్పుడూ మురికిగా
వుండేవాళ్లంటే,
ఛీఛీ అసహ్యం!
ఛాఛా అరోచకం!

వర్ధిల్లాలి సబ్బూ, నీళ్లూ,
వర్ధిల్లాలి తువ్వాళ్లూ, బ్రష్షులూ
వర్ధిల్లాలి తెల్లని టూత్‌పేస్టు,
వర్ధిల్లాలి తలనూనే, దువ్వెనా.

ఒళ్లంతా ప్రతి ఉదయం శుభ్రపరచుకుందాం,
నీళ్లతో చెలిమి చేసుకొని నిత్యం ఆడుకుందాం
తొట్లల్లో, బానల్లో, చెరువుల్లో, కుంటల్లో,
యేర్లల్లో, కాల్వల్లో, నదుల్లో, సముద్రాల్లో.

